హారతులొసగంగవలయు, కాదెమీరలెల్లరు.

౧ కర్పూరగంధులెల్లఁ గలసి వేడుకమీఱఁగా
సర్వరాజభూషితుండగు. స్వామికిశర్వాణికి. హా.

౨ రతనాలతోడఁగూడి, రాజిలుపళ్లెరములో
రాజితాద్రివాసునకు వి, రాజిత శుభగాత్రికి. హా.

౩ పరతత్వామోదహృదయు, భాసితునకుశూలికి
కరుణాంబుధినచ్చమాంబి, కకొసంగరు దేవికి. హా.



అంగనామణులార దివ్య మంగళమనరే;
పొంగుచు శ్రీరంగవిభుని, పాలంతికినిపుడు. జయమం.

౧ నీరరుహాననను సకల, నిగమవినుతను;
శ్రీరమణీమణికి భవని, వారిణికిపుడు. జయమం.

౨ కరుణను వరములనొసంగు, కలుములచెలికి;
సురమునివరసేవితమున, మరవినుతమున్. జయమం.

౩ అచ్చమాంబికావినోది, కతులసుహృదికి;
ముచ్చటలలగంగమీర, లచ్చుతుసతికి. జయమం.



# శుద్ధపత్రిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫ | ౧౫ | దు | చు |
| ౭ | ౧౪ | గ | ర |
| ౧౧ | ౫,౬ | యు | యూ |
| ,, | ౧౯ | చ | చా |
| ౧౨ | ౮ | దు | రు |
| ,, | ౧౨ | మా | వా |
| ౧౪ | ౫ | స | ప |
| ౧౭ | ౧ | వు | పు |
| ,, | ౧౩,౧౪ | | విరాజితాంఘ్రి యుగ్మ శ్రీ, కరాస రోరుహాత్మనన్. |
| ౧౮ | ౧౪ | గిం | గీం |
| ,, | ౨౧ | మీఱహారా | నీరహారా |
| ౧౯ | ౧౮ | నను | నని |
| ౨౦ | ౨౧ | వృన్మం | వృణ్మం |
| ౨౨ | ౧ | ణుండవనుచున | ణుఁడవనుచునున |
| ౨౩ | ౯ | | ది |
| ౨౪ | ౧ | ను | ము |
| ,, | ౧౪ | చ్ఛ | చ్చ |
| ౨౫ | ౧౮ | మరి | వారి |
| ౨౭ | ౫ | | ల |
| ,, | ౧౭ | ప్రకటనమండ | ప్రక్కనెయుండ |

| పేజి. | పంక్తి. | తప్పు. | | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౨౯ ... | ౩ ... | ఉమె | ... | లె |
| ,, ... | ౧౪ ... | రారా | ... | రారే |
| ౩౧ ... | ౧౨ ... | ఛ్ఛి | ... | చ్ఛి |
| ,, ... | ౧౪ ... | యుఁగా | ... | యు గా |
| ౩౫ ... | ౫ ... | యో.యో.యోమ. | ... | యూ.యూ.యూ. |
| ,, ... | ౬ ... | యువధ.యు.యు. | ... | యూ యూ.యూ. |
| ౩౬ ... | ౫ ... | నతివ | ... | యతివ |
| ,, ... | ౨౦ ... | కానను | ... | కావను |
| ౩౭ ... | ౧౮ ... | కరుణా | ... | కగుణా |
| ౩౮ ... | ౭ ... | ధినను | ... | ధివను |
| ౪౨ ... | ౬ ... | లుల్ | ... | లున్ |
| ,, ... | ౧౫ ... | కందు | ... | కంది |
| ,, ... | ౨౩ ... | వైచి | ... | వేచి |
| ౪౩ ... | ౧౯ ... | దేపు | ... | దేవు |

☞ చూపటులు తక్కుంగల తప్పులదిద్దుకొనఁ బ్రార్థితులు.





శ్రీ ర స్తు.

శ్రీ వా ణ్యై న మః.

## పూ జా వి ధా న ము.

ఉ॥ ఎవనిపదిద్దలంప నుతి, యింప భజింప నమస్కరింపసం
శ్రవణమొనర్ప లోకము క, రంబతికల్మష రాశిఁ బాయు న
ద్ధవుఁడసమానకీర్తి సత, తస్తుత వైభవమూర్తి ధీర భ
క్తవరమనోనువర్తి నిరత, మ్మొసఁగూర్చెదు మాకభీష్టముల్॥

శా॥ శ్రీవాణీ, పరతత్త్వరంజితగుణ- శ్రీరమ్యచూడామణీ,
దేవీ! భక్తిఁ బతివ్రతానికరము-ద్ధియుక్తి సేవింప నన్
గావనాశ్రీవె సువాక్ప్రపంచమిడవే-కల్యాణి నిన్గొల్చుటన్
వేవేగంగరుణామృతమ్మిడవె స- ద్విద్యాంసహృద్వాసినీ!॥

శా॥ భాషాయోష, పరిపూజితాఖిలసుధీ- పరిజ్ఞావిశేషా, సువా
క్పోషా, దివ్యపతివ్రతా, సుకవిసం- పూర్ణార్ధవాచాలసత్
భూషా, భవ్యసరోజరాజితకరో- త్ఫుల్లాబ్జ విద్వత్కృపా
వేషా, శాస్త్రవిశారదాయనుచు దే- వీనిన్నుఁబ్రార్థించెదన్॥

ఉ॥ సారసనేత్రి! నిన్ను మది- సన్నుతిఁజేసెదనమ్మ, వేడుకన్
వారిజనాభు పుత్రినెదఁ, బాయకయుండెడి భామినీమణీ!

నారదతుంబురాదిముని- నాథులు నిన్గొనియాడుచుందురో
శారద! నాదువాక్కు-నను(గ్ర-సాదమతిన్వసియించియుండ మా॥

శా॥ నిర్విఘ్నంబుగనొనర్పుమీ కరుణతో-నిన్వేడెదన్ దేవగం
ధర్వాదుల్వినుతింపనేరని కళా-ధాముండవీవెంతయున్
శర్వాణీప్రియనందనా నరులకు-న్శక్యంబె నిన్వేడ నీ
యుర్విన్శాశ్వతకీర్తినిచ్చి మనుప-న్యోచింపుమీ మ్రొక్కెదన్.

శా॥ శ్రీవిఘ్నేశ, ధరాధరేశ్వరసుతా- శ్రీః ప్రాప్తవిస్తారశో
భావేశాత్మ, పరాపరాధిపసమీ- పప్రాభవా, దేవభూ
దేవా దేవసహస్రకార్యకరణా-ధీనా- గణాధీశ నిన్
భావింతు న్మది విఘ్నముల్దునుము సౌ-భాగ్యప్రదానిచ్చలున్.

౧. భూతాపకర్షణము- దేవతాహ్వానము.

రాగము- తాళము-

'హాసిగేదయమాడసుందరా' వలె.

ఘంట మోయఁగను నుతింపరే- కరుణాకరయని. ఘంట.

౧ భువినిదుష్ట-ములగుభూత-నివహములను-దవిలికూల్పు. ఘంట

౨ దేవమ్ముఁ- బ్రోవరమ్ము- పావనమ్ము- నీవరవని. ఘంట.

3 ఆదరమ్ము-తో దయఁగను- మచ్చమాంబి- కార్చితయని. ఘంట.

---

౨. విఘ్నేశ్వరపూజ.

రాగము- తాళము-

'హేసరస్వతి' వలె.

శ్రీగజాననా- వర- యోగిభావనా-

వేగవిఘ్న- వితతిఁ దునుమ- వే సురావనా. శ్రీ.

౧ అర్ఘ్యపాద్యముల్- స్నా- నాసనాంబరముల్-
యజ్ఞోపవీతముం బ్రి-యంబునం గొనుమీ. శ్రీ.
౨ గంధమున్సుమా- ర్చన- మంది ధూపమున్-
సుందరమగు- చుందగుది- వ్వాందయం గొనుమీ. శ్రీ.
౩ అరిసెలు ఫేణీల్- గలమ- హాన్నై వేద్యముల్-
అచ్చమాంబి- కార్చిత పు- ష్పాంజలిం గొనుమా. శ్రీ.

---

## ౩. ధ్యానము-

రాగము- తాళము-

'భజేభజే గజేంద్రపాల భవ్యమంగళమ్' వలె.

నతుల్మదంబుతో సమర్ప- ణంబు చేసెదన్-
నుతుల్సురార్చితాయటంచు-ను నిదె వ్రాసెదన్. న.
౧ జనానురం- జనప్రతాప- శరణుబ్రోవవే-
దినాధిపమత- దివ్యనవ్య- తేజగావవే. న.
౨ సమస్తలో-క మాన్య పాప- సంఘశోషణా-
విమోహపా- శమోచనన్నృప- వీరతోషణా. న.
౩ అకార్యదూర- యచ్చమాం-బికాప్రణుతగుణా-
వికారశూన్య కావుభక్త- వితతిఘనగుణా. న.

---

## ౪- ఆవాహనము.

రాగము- తాళము-

'చిన్నికృష్ణ నన్నుం బ్రోవవేర' వలె.

సన్నుతింతు- నిన్నుమది- నెన్ని- మా- యన్న. స.

౧ పున్నమవెన్నెల- కన్న బల్మిన్నయౌను- యున్నతిఁగన్న వి- ద్వ
న్నుత స్వప్రకాశ. స.

౨ పాలనశీలా యీ- లీల జాగేలమమ్మ- మేలుగ నేలు వి- శ్వేశ
సద్గుణజాల. స.

౩ ముచ్చటలెచ్చింప- విశ్వేయు మిచ్చోట- నచ్చమాంబావన- స
చ్చిదానందమూర్తి- స.

---

## ౫. ఆసనము.

రాగము- తాళము-

'జలజోద్భవశిల' వలె-

నూత్నకాంతులవెలుఁగు- రత్నపీఠమునఁ
బత్నియుతుండవై- భాసిల్లఁగదవే. నూ.

౧ సింహాసనారూఢ- చిఱుతగద్దె యిది
సింహవిక్రమ భక్తి- చేఁ గొల్చితిమని. నూ.

౨ పద్మములవలెఁ జే-పట్లు దీర్చితిమి
పద్మదళాక్షునీ- పాప్రఁగోరితిమి. నూ.

౩ విశ్వేయుమనిబాల- వినుతిసల్పితిమి-
యచ్చమాంబావంద్య- యనుచుమొఱ్ఱిడితిమి. నూ.

---

## ౬. పాద్యార్ఘ్యాచమనీయములు.

రాగము- తాళము-

'ఏలర నాపై' వలె.

పావనమూర్తి గొను, పాద్యము నర్ఘ్యము;

నీవికనాచమ, నీయము చేయుము. పా.

౧ బుధనుతచరిత యీ- మధుఘృతపుష్పరస-
దధియుతమును నీ- దరినిడి మ్రొక్కితి. బా.

౨ చందనదుర్వాక్షతల్- కుందకుశాంకుర-
బృందము గల యీ- మందాకినీజలము- పా.

౩ పచ్చకర్పూరముతో- బంగరుపాత్రతో-
నచ్చమాంబికానుత- యిచ్చితి భక్తిమీఱ. బా.

౭. స్నానము.

రాగము- తాళము-

'కంగన్వామరె' వలె-

గంగన్వేడు-నీ- కుంగాన్కనా- సంగితిదేవా
హై- బాంగస్నానమాడు- నీ-యంగీజోడువీడు
శృంగారస్వ- చ్ఛాంగీయుత- సంగీతలోలా. గం.

౧ మంచిపన్నీటనిదె-ప్పించినాము నేడు మే- లెంచిస్నానమాడు
పంచామృత-మందున్నది. నెంచిగొనుమీ. గం.

౨ అచ్చమాంబార్చిత- న-న్మెచ్చికావనెంచి- నీ- యిచ్చ న్సంతసిం
చి- యిచ్చోమద- మెచ్చన్ కృప- నిచ్చిగనుమీ. గంగన్.

౮. వస్త్రము.

రాగము- తాళము-

'సన్నదిసన్నదివరలామె' వలె

దేవదేవోత్తమాదివ్యతేజా, కావుమీభక్తసత్కల్పభూజా;

దివ్యసద్వస్త్రములిచ్చినాము, దేవితోఁదాల్పుమిఁకవిమలా. దే.

౧ చక్కనౌ మేల్జరీశాల్వలివిగో, సన్నమౌ శాల్యపురిచాపులివిగో;
సామగానప్రియా సన్నుతింతున్, స్వామియుప్పాదవస్త్రమ్ము
లివిగో. దే.

౨ కంచి కొర్రానాడ ప, ట్టంచు చీరెల్, మంచికాశ్మీరసరి, గంచు
అపికెల్, ఎంచి వాయించి తెప్పించినాము, మించిభక్తిని స
మర్పించినాము. దేవదేవోత్తమా దివ్యతేజా.

3 పచ్చనౌ మేల్జరీపట్టువల్వల్, దెచ్చి సరిగంచుతోనిచ్చినాము,
చెచ్చెరందాల్పుమీ సేవగొనుమీ, యచ్చమాంబికనిను-న్నైద్చుఁ
గాన. దేవ.

---

౯. యజ్ఞోపవీతము-

రాగము- తాళము-

'వైశాఖమాస, వాసంతిక' వలె

యజ్ఞోపవీతముంగొను స, ర్వజ్ఞ మహాత్మ॥ య॥

౧ బ్రహ్మాణగళభాసితము పర, బ్రహ్మస్వరూప॥ య॥

౨ భవబంధమోక్షణము తేజో, బలసమృద్ధియున్॥ య॥

3 సురవంద్య యచ్చమాంబార్చిత, పరమపవిత్ర॥ య॥

---

౧౦. తిలకము.

రాగము- తాళము-

'హితనిదిటయిలోన'వలె.

దేవధరియింపుమయ్యా, తిలకంబు. దే.

౧ ధీరయీాక, స్తూరి నీదు, సారసాక్షితో మతన్. దే.
౨ చందనము,నందినీదు, సుందరాంగి, నందమొంద. దే.
3 అచ్చమాంబి,కార్చితయని, యర్చనము,నర్చిదన్. దే.

---

౧౧. గంధము.

రాగము- తాళము-

'దేవునదివ్యామతే, పరస్వతి'వలె.

వేగమెగయిఁకొనుమీ శ్రీగంధమున్, వే- శ్రీ.
యోగివినుతసక,లాగమసన్నుత, వే. శ్రీ.

౧ సన్నజాజివిరులఁ, బన్నీరుఁ గలిపి
బాగుగఁదీసితిమి- శ్రీ. వే. శ్రీ.

౨ కోరికమీఱఁగ,స్తూరి పునుంగును
జేరిచితెచ్చితిమి, శ్రీ. వే. శ్రీ.

3 అచ్చమాంబికానుత, పచ్చకర్పూరముతోఁ
జెచ్చెరనొసఁగితిమి, శ్రీ. వే. శ్రీ.

---

౧౨- మాల్యము.

రాగము- తాళము-

'వేగఁబోవరావదేరనాగభూషణా' వలె.

ఓజగన్నాథ మాల్య, మొప్పుగఁగొనుమీ
రాజరాజార్చిత యీ, పూజనుగనుమీ. యో.

౧ మల్లెమొల్లజాజిపువ్వు, మాలికలివిగో;
చల్లనిపన్నీటి విరుల, సరములునివిగో. యో.

౨ తళ్కుచెంగల్వకల్వ, దండలునివిగో;
తుమ్మిచేమంతి విరిస,రమ్ములునివిగో. యో.
౩ అచ్చమాంబి,కార్చితమణి, హారములివిగో;
పచ్చని తులసీమాలిక, లిచ్చితిమివిగో. యో.

---

### ౧౩-ఆభరణము.

రాగము- తాళము-

'గంధము లందరా రే యోయిందువదన' వలె.

దోషహరణ గైకొనుమణి, భూషణములను,భూ,మణిభూ; దో.
కరుణతోఁదలఁ దాల్పుమియా,కలికితురాయి,యాకల్కి,యా;దో.
ఉంగరములఁ దాల్పుమి నీ,యంగనతోడ,నంగన,నీప్రియాంగన;దో.
అచ్చమాంబికార్చితపద,హారములివిగో, హా, చంద్రహా; దో.

---

### ౧౪. పూజ.

రాగము- తాళము-

'నను గావవేఁగ రావ దేర' వలె.

శ్రీదాయకాయనమః ఓం శు,భాయ నమః ఓం శాం,తాయన
మః ఓం పర,మాయనమః ఓంప్రస,న్నాయనమః ఓం, ధీయు
తాయనమః ఓం, దివిషద్వర,దాయకా.
౧ యో,గ్యాయనమః ఓం, యుగంధ,రాయనమః ఓం శౌ,ర్యా
యనమః ఓం, త్రిగు,ణాయ నమః ఓం, స్వతం,త్రాయ నమః
ఓం శ్యత్రిత,రాయనమః ఓం, తత్త్వామృత,దాయకా.
౨ ధ,న్యాయనమఃఓం, కల్యా,ణాయనమఃఓం,ధీ, రాయనమఃఓం

హ్వ, ద్వాయనమః ఓం, హిరణ్య, యాయనమః ఓం, సత్యవ్ర, తాయనమః ఓం, అనుపమఫల, దాయకా.

3 అచ్చమాంబి, కార్చితాంఘ్రిద్విత, యాయనమః ఓం, ర, మ్యాయనమః ఓంపూ, ర్ణాయనమః ఓం, తమోప, హాయనమః ఓం, శ్రియు, తాయనమః ఓం, శ్రితపోషణ, దాయకా.

౧౫. ధూపము.

రాగము- తాళము-

'బంతులాడెనే' వలె.

ఓపరాత్పరా, ధూపముఁగొను-పాపహరణ-యోపరాత్పరా.

౧ సొగసుమీఱఁగా, నగరొత్తులిడుఁగడ వెలుఁగ. నో.

౨ గంధముపునుఁగున్, ఘనమగు సాంబ్రాణి వెలుఁగ. నో.

3 పచ్చకప్రముతో, నచ్చమాంబికార్చితాంఘ్రి. యో.

---

౧౬. దీపము.

రాగము- తాళము-

'సరోజశరునిబారికినై సైపలేనురా' వలె.

దేదీప్యమానవిగ్రహ గొను, దీపహారతి;
దీవెనలనొసంగుమిదే, దివ్యహారతి. దే.

౧ జ్యోతిర్మయాత్మ గొనుమాత్మ, జ్యోతిహారతి;
పాతకసంహరణ యిదే, పంచహారతి. దే.

౨ గంభీరగుణాగ్రగొను న, క్షత్రహారతి;
కుంభత్కిరీటబూటయిదే, కుంభహారతి. దే.

౩ అచ్చమాంబికసుతసుమా, నంతహారతి;
సచ్చరిత్ర మితాఘఘన, సారహారతి. దే.

---

## ౧౫. నైవేద్యము.

రాగము- తాళము-

'హారతివేళగిరనీకు' వలె.

ఆరగింపవయ్యదేవ, సారసాక్షితోడనేడు.

౧ ఆచమనంబాచరించి, యాపోశనల్ స్వీకరించి;
శ్రీచరణా, శ్రితజనముల, సేవఁగొంచి గారవించి. యా.

౨ భక్ష్యభోజ్య లేహ్యచోష్య, పానీయములనెఁగఁ బరగు
పంచభక్ష్య, పరమాన్నము, లంచితముగ వొసఁగితిమి. యా.

౩ అచ్చావులనేతితోడ, నతిమధురంపుదధితోడ;
నచ్చమాంబి, కార్చితపద, యిచ్చిననైవేద్యమిదె. యా.

---

## ౧౬. హస్తపాదోదకాచమనీయములు.

రాగము- తాళము-

'పూలవసంతములాడెను' వలె.*

గంగా, జల, కలశముఁగొనుమిదె. గంగా.

౧ మంగళప్రదా, మగువకునీకును;
బొంగుచునుత్తరా, పోశనమునకై. గంగా.

౨ కంఠశుద్ధికిని, గండూషమునకు;
కరపదక్షాళన, కరణమ్ములకున్. గంగా.

౩ ఆదిపూరుషా, యాచమనీయము

నావరింపు మచ్చ,మాంబిక ప్రణుతా. గంగా.

౧౯. తాంబూలము.

రాగము- తాళము-

'చూడ రే ప్రియుని మాయ,లాడి యింటికి గన్' వలె.

చేడియతోడఁగ్రపవు, వీడియంబు సేయవమా; చే.
నాడెమైన భక్తులనిన్, బాడిసేవఁజేయవమా. చే.
౧ బంగరుపళ్లెరంబునఁ, బండుటాకులుంచెదను;
రంగయినపీటివక్కలు లే,వంగములచేనిండెను. చే.
౨ జాపత్రి కుంకుమపువ్వు, జాజికాయ మేలకుల్;
నీపైభక్తినిచ్చితిమి, నీరేజపత్రేక్షణా. చే.
౩ అద్వైతానందస్వరూప, యచ్చమాంబికార్చితా;
విద్వాంసప్రమోదాకర, విన్నపంబుగయికొని. చే.

౨౦. నీరాజనము.

రాగము- తాళము-

'రాజారేపతంగ్ ఉడాయారే' వలె.

* కర్పూరనీరాజనం సమర్పయామి;
నమామి నమామి నమామి గృహాణ. క.
౧ జగదార్తిసంహరణ, సుగుణాభరణా;
నిగమసంచరణ, నిపుణగృహాణ. క.
౨ దివ్యమానిపోషా, ధీవరతోషా;
నవ్యసద్భూషా, నంతగృహాణ. క.

3 ఆదిత్యసంకాశ, భేదవినాశ
అచ్చమాంబికాప్రణు, తాంఘ్రి గృహాణ. క.

౨౧. హారతి.

రాగము. తాళము.

'ఏనుబీగత్తి' వలె

దివ్యమంగళమ్, నగధీర మంగళం.
కరుణారసపూరిత, సారకటాక్ష, ధార మంగళమ్.

౧ చారణగంధర్వా, మర, సాధ్యకింపురుష, గరు,
డోరగకిన్నర, వారనమస్కృత, చారుగుణాభరణా॥ ది॥

౨ నతజనపరితోషా, ముని, నాథ హృద్వాసా, స,
న్నుతఘనవిద్యా, స్వత రవినిభభా, సిత తేజోమూర్తీ॥ ది॥

3 ఆదికవిప్రణుతా, పర, మాత్మ సుజనహితా, విన
యావనతాచ్చ, మాంబాత్యంతా, ర్చావన, శుభనిపుణా॥ ది॥

౨౨. మంత్రపుష్పము.

రాగము. తాళము.

'కమలాంబ నా, చింతc దీర్చవమ్మా' వలె

మహిమాన్వితా, మంత్రపుష్పముc గొను॥ మ॥
మహాసపోష బ్రహ్మాండనాయకా॥ మ॥

౧ సాహస్రశీర్షా, సత్యవాగ్విభూషః
సహస్రారవా, సా దేవదేవ॥ మ॥

౨ రవికోటితేజా, కవికల్పభూజా;
దివిజార్చితా, దివ్యహాసనేవ్య॥ మ॥

౩ ఆద్యంతశూన్య, ఆగమార్థజన్యః
అచ్చమాంబికా, హ్లాదకారణా॥ మ॥

## ౨౩. ప్రదక్షిణ నమస్కారము.

రాగము. తాళము.

'తాండవనృత్యకరీ, గజానన' వలె

పాండురకీర్తిధరా, పరాత్పరా.

౧ రక్షణక్రియా, దక్ష ప్రదక్షిణ,
మీక్షితి నొనరింతున్, రక్షింపుమి॥ పాం॥

౨ తొలిభవమున నే, తెలియక చేసిన,
దోసములనణంపుమీ, దాసావన॥ పాం॥

౩ అఘములడంచి బ్ర, హ్మానందమొసంగు,
మచ్చమాంబికానుతా, యార్యార్చిత॥ పాం॥

---

## ౨౪. మంగళము.

రాగము. తాళము.

'మంగళవెన్నిరిరంగగే' వలె

మంగళకరశుభమంగళం- మం. జయమం॥

౧ మహిమాన్వితమణిమయపాత్రిణ,
మహితనీరాజనం, స్వీకురు. శ్రీకర, శో,భాకర. జయమం॥

౨ దురితహరణ, సుం, దరవరకరుణా
కర సర్వజగ, త్కారణా, కారణ, భవ, తారణ॥ జయమం॥

౩ అచ్చమాంబికార్చితపదయుగళ,
అద్వైతబ్రహ్మాత్మక, ఆత్మక, సర్వాత్మకా॥ జయమం॥

౨౫. లాలి. రాగము. తాళము.

'పంచతుండనత'వలె

లాలి తేజోఘన, లాలి రాజానన, లాలిపూజావన, లాలిలాలి॥ లా॥
లాలిదివిజార్చిత, లాలిభువనసుత, లాలిసవనహిత, లాలిలాలి॥ లా॥
లాలిదురితహర, లాలికరుణాకర, లాలిపరమాదర, లాలిలాలి॥ లా॥
అప్రమేయగుణ, యార్తరక్షణచణ, యచ్చమాంబికా, వనలాలి॥ లా॥

౨౬. జోల. రాగము. తాళము.

'రంగనాథాపురీతోబెగానే'వలె

దివ్యనామా పరంధామా జోజో॥
౧ ధీమాన్ప్రసన్నా జోజో, దివిజార్చితాంఘ్రిజోజో;
భామామణీయుక్త జోజో॥ ది॥
౨ పరమాత్మ జోజో, ప్రణవస్వరూపాజోజో;
వరమానివ్యాద్యాస జోజో॥ ది॥
౩ అమరేంద్రపోషాజోజో, యమితప్రసన్నా జోజో;
యచ్చమాంబావంద్య జోజో॥ ది॥

౨౭. హెచ్చరిక. రాగము. తాళము.

'అవధరింపుమీ రామ'వలె

అవధరింపుమీ, దేవ. యవధరింపుమీ॥
౧ భక్తిమీఱ దాసులు నీ, భజనచేయుచున్నవార॥ అ॥
౨ అద్వితీయ తేజా నీ, చిద్విలాసమై భవమిదె॥ య॥
౩ అనుభవ వేద్యస్వరూప, యచ్చమాంబికావినతుల॥ న॥

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీ పరబ్రహ్మణే నమః.

# కీర్తనలు.

రాగము. తాళము.

'విధితనమే' వలె

నతవరదే, శారదే

అతులితహితమతి, చతురతలాసంగుము, వరదే, శారదే. న॥

౧ సారసముఖ్యేక్షదణ, నీరజపాణి ద, యారసముప్పంగ, దనయ

నుతులుగొని, గారవమున నోసంగవె వరములనత, వరదే. శా॥

౨ సన్నుతించెదంబ్ర, సన్నహృదయనా, విన్నపములువిన, వే కల

వాణీ, నన్నేడఁబాయకు, నారదనుతనత, వరదే॥ శా॥

3 ముచ్చటలలరవి, యచ్చరవందిత, చెచ్చెరఁ గావవె, శ్రితపరి

పాలిని, యచ్చమాంబికా, హ్లాదకరీ నత, వరదే॥ శా॥

రాగము. తాళము.

'నమిలాశ్రీగణ, నాథగజానన' వలె

సనుగావంగదేవం, దనమాచరింతు సద్గుణమణిగణనాయకా,

ఘనయోగీంద్ర హృ, ద్వనజదినేంద్రా,

సనకాదినుతకీర్తి చంద్రా, దేవాదేవ, దినమణినిభదీప్తి సాంద్ర- న-

౧ పర్వతధీరా, గర్వవిదూరా; ( నను॥
శర్వాణిముద్దుకుమారా, దేవదేవ, యుర్వీసురహృద్విహారా.
౨ పరమపావనభక్త, పరిపాలనాసక్త; (క్తా. నను॥
కరుణఁజూడఁగదే ధీయుక్తా, దేవదేవ, సరసనతకావితానుర
౩ మెచ్చిబ్రోవఁగవేరా, ముచ్చటల్మీఱ; ( రా. నను॥
నచ్చమాంబావంద్య రారా, దేవదేవా, యరిషడ్వర్గాదివిదా

---

రాగము. తాళము.

'గోపీనందన'వలె.

కావవె కరుణాకర శ్రీరమణా;
సేవలుచేసెద, దేవనుతా. కా॥
౧ పంకజలోచన, పాపవిమోచన;
శంకరహిత శ్రీ, వేంకటరమణా. కా॥
౨ వారిజోదర, వారధిబంధన;
వాసవనుత ని,న్నాసతో వేడెదఁ. గా॥
౩ మెచ్చిభక్తజను, లెచ్చరింపఁగ;
నచ్చమాంబికా, హ్లాదకరచరిత. కా॥

రాగము. తాళము.

'బేబాబేబంగాళా మే, మాలానియాజ'వలె.

తల్లిశ్రీమహాలక్ష్మమ్మ, దయఁజూడఁగదే. త॥
౧ చల్లనితల్లి మ,మ్మెల్లర మాపసి;
పిల్లలఁబ్రోవవె స, త్ప్రేమాస్పదవై. త॥

౨ భామినీమణినిన్ను, భక్తినుతింపుచు;
సేమమ్మలిడనతి, చేసెదజననీ॥ త॥
౩ అచ్చమాంబికనుతు, లందివేమకల్మిఱ;
మెచ్చియీవీదునకభయ, మిచ్చికావఁగదే. త॥

రాగము- తాళము-

'చెలియానేనేమిసేతు, చెలువునిబాసి' వలె

శరణంటిఁబ్రోవవేగ, శంకరధీరా. శర.
౧ నెరనమ్మినార, కరుణమీఱ, బిరబిరరారా. శర.
౨ సురవరదసోమ, ధర నిరామ,యరహితకామా. శర.
౩ మెచ్చినిచ్చలుఁగృప,నిచ్చికావు, మచ్చమాంబికను. శర.

రాగము. తాళము.

'విరాళిజేసిసుందరీ' వలె.

బిరానఁబ్రోవ,రాభవా, హరాపరా,త్పరాశివా. బి.
౧ పరాకిదే,లరానిరా,కరింపఁబాటిగాదురా;
సురేంద్రవంద్యగావరా, పరాంబికామనోహరా. బి.
౨ నిజమ్ముగ నని,శమ్ము ని, న్భజింతు నెమ్మనమ్మునన్;
ద్విజస్తుతప్రశస్తస, ద్భుజంగరాజభూష నన్. బి.
౩ శుకాదివంద్య యచ్చమాం,బికాహృదబ్జపూష స్వః
ప్రకాశ సర్వసాక్షి ని,ర్వికార దీనరక్ష నన్. బి.

రాగము- తాళము-

'అరవిందనయన రంగని హాయి, లెందుగాననే' వలె.

నమ, యందునమిత, సుందరముని, వందితచరితా.

యిందుశేఖరా, యింద్రిరాధృత, నందితమహితా. నమ.

౧ రాగరహిత, రాగశేఖరా, వేగనన్ బ్రోవ

యోగిపోషణ, యాగమహిత, శ్రీగిరీశ్వరా. నమ.

౨ ఈశ దోష, నాశ వాసవా, ధీశ వేరా వా

గీశపోష, ణా శివాభవా. నమ.

౩ నిచ్చలు నుతు, లిచ్చువేడుక నచ్చమాంబిక

మెచ్చివరం, బిచ్చికావుమింక. నమ.

---

రాగము- తాళము-

'నిన్నే నెరనమ్మితిఁగదరా యో' వలె

నాగచర్మాంచితవసనాయో, నారదవంద్యా, ననుగావర. నా.

౧ భోగీంద్రు, భూషణ సుర, యోగీంద్రు, పోషణ ఘన;

రాగరహితభవ, శ్రీగౌరీధవ, రాఁగదవె, కృప, నీఁగదవె,

రాఁగదవె; వేగావర, వేగావర, వేదవినుతగుణ. నా.

౨ మేలెంచి, నాదుమొఱల, నాలించి, బ్రోచుటకిది;

వేళయనుచునిను, వేమఱువేడిన, జాలముసేయుట, మేలట

రా, మేలటరా; పాలింపర, పాలింపర, పావనచరితా. నా.

౩ ఆర్త, శరణ్యాఖ్యుఁడ, నచ్చ, మాంబికావినతుల; నారయరా,

కృప, మీఱహరా, వే, సారులు మ్రొక్కెదఁజంద్రధరా, చం

ద్రధరా; జాగేలర, జాగేలర, సరసిజభవనుత. నా॥

రాగము.　　　　　　తాళము.

'వగలాడీ, వలచికొంటినో' వేవలె

వరమీరా, పరశివ రారా.. వర.

సురవరద పరాత్పర కరుణాకర. వర.

౧ నిరతమునీపద, సరసిజములనెద;

తిరముగనిడిమొద, సురమునివరద. వర.

౨ భూధర కార్ముక, బుధజననత పద;

మాధవసన్నుత, మా రారీని న్వేడద. వర.

౩ నిశ్చలునీకృప, నిచ్చివేగావర;

యచ్చమాంబికనేక, నరమరలేటికి. వర.

---

రాగము-　　　　　　తాళము-

' పాలయరఘు, కులజలనిధిచంద్రా' వలె.

నమ్మితి జగన్నాథ కావంగరాదా;

నాతోవాదా, నాతోవాదా, నమ్మి.

౧ వరమానీంద్రా, మరవందిత నీస;

చ్చరితామృతము నీయరా, శంకరనీస, చ్చరి. న.

౨ కరుణాకరనన్, బరిపూర్ణకృపన్;

శరణార్థిననుకావరా. దురితవిదూరా, శర. నమ్మి.

౩ సచ్చారిత్రా, సదమలగాత్రా;

యచ్చమాంబికఁ బ్రోవరా, యభయమునీరా, యచ్చ. న.

---

రాగము. తాళము.

'బాలాగోపాలనీవు గారా' వలె.

దేవా ననుగావఁగ రావా, ధీవినుత దేవ. దేవా.

దేవా ననుగావఁగ రా, వా వాసవాదివంద్య,

సేవఁ జేసెదఁ జిత్స్వభావా పరమాత్మ దేవ. దేవా.

౧ మేలా నన్నేలరావే, వేళఁ గరుణాలవాలా, నీలకంధర వే
రా రా; జాగేలా యిఁక, నీలకంధర వేరా రా;—శైలజలోల
భక్త, పాల సద్గుణజాల, ఫాలలోచన చర్మ, చేలా యశో
విశాల. దేవా.

౨ ధీరా నిర్మలవిచారా, మారసుందరాకారా, శ్రీరాజశేఖర
రారా; జాగేలా యిఁక, శ్రీరాజశేఖర రారా;—మేరార
ణశూశా నిర్వి, కారా తత్వప్రచారా, నారదమౌని హృద్వి,
హారా సుకుమార దేవ. దేవా.

౩ శ్రీవేంకటరామావన, భావితాచ్ఛమాంబావినుత, కోవిదసము
దయ మనోభవ; జాగేలాయిఁక, కోవిదసముదయ మనోభ
వ;—భూవరేంద్రసర్వలోక, పూజితశుభచరణ కరుణఁ గా
వవే శరణ్యదేవ, గజాసురారి కులవిదారి. దేవా.

---

రాగము. తాళము.

'సుందరముఖ, తుండిలతను, నందికేశ్వరా' వలె.

నందితముని, బృందన మో, యిందురాభవా

ఇందిరా హృన్మందిరనత, యిందురాభవా. నం.

౧ ఇమ్మహినిను, నమ్మితినని, శమ్మశంకరా,

సమ్మతి నభ, గో ష్మిమ, వే, గమ్మెశంకరా,
రమ్మా, మమ్మా, రయలెమ్మా, జయ మిమ్మా, దయనొసంగుమా. న.
౨ హరిహయనుత, శిరధృతసీ, రవిహ లోచనా,
వరదనిరా, కరశశివ, హిమ్నరవిలోచనా,
కరుణా, కరశ్రీ, కరపద నాకరమణ నా, గమణిభూషణా. న.
౩ హరమహావ్యాళ ప్రణుతాచ్ఛమాంబికా
మారశుభా, కారాస్తో, మాత్ర్యంబకా
యేరా, ధీరా, శూరవరా, రారహారా, నేరషేమిరా. నం.

---

రాగము. తాళము.

'కూవాపయాసన్ మేటి తాళ' వలె.

దేవా మహానుభావా బ్రోవ— భావాబ్రోవ
రావారాజిత శైలేశ- వేగమెబ్రోవరా. దేవా.
౧ గర్వాంధహారా, సర్వాధారా, సర్వా—
శర్వాసద్భక్తపోషణా శాశ్వతవితరణ, శర్వా- దేవా.
౨ జగదార్తిహరా, సుగుణాధారా, సుగు—
నిగమాంతారణ్యసంచారా, నిర్మలవిచార, నిగ. దేవా.
౩ విచ్చేయవేరా, విమలవిచారా, విమ.—
యచ్ఛమాంబికబ్రోవరా, యాపద్విదార- యచ్ఛ. దేవా.

రాగము. తాళము.

'స్మరియించెదఁగృష్ణన్' వలె

కరుణాకరరావే, కావఁగదేమో, కరుణా.

పరాత్పరత్రిజగత్ప్రభూ స,ర్వరక్షాచణుండవనుచు న
మ్మిరక్షింపుమటంటె నా,దరంబున వరంబులొసంగవే. కరుణా.

౧ సురదైత్యయక్షఖే, చరులంబో్రిచినమేటి, దొరవని నెరనమ్మితి;
బో్రిచిన—మ్మితి; నిరామయసర్వసాక్షియ,క్షరాపరమాత్మగి
రిజే, శ్వరా నిగమాధ్యక్ష శం,కరావేం,గరాకరుణింపరా. క.

౨ మునివంద్యబో్రివుమీ, తనయనను జగ,జ్జననినీకుఁదెల్పఁగా;
ననుదు—ల్పఁగా; జనార్దనవినతుల్సెలంగనన్గృపఁగనరావెవి-
ఘ్నునాశంబునొనర్ప నీతనూభవుని నెమ్మదిఁగొల్చెద. కరుణా.

౩ అమరార్చితాంఘ్రియు,గ్ర మహేశ్వర యచ్చ, మాంబికఁ ద
యఁజూడరా; యీశ్వర—డగా; సుమాత్రవిజయసర్వలో,
కమాన్యాగమవంద్య నీ,వె మన్నించెద వంచు భ,క్తి మీఱఁగ
నమస్కృతినొసఁగెద. కరుణా.

---

రాగము. తాళము.

'మాటలాడఁ, రావదేమిరా' వలె

దేవానను గావఁగరావా, దేవాధిదేవా నను,గావఁగరా వా-దేవా.
భావమందు నిన్నుఁగదు, భక్తితోఁగొల్చెద. దేవా.

౧ స్వామికృపాకర, సోమపరాత్పర, నీమహిమఁదెలియ, నేరను
సద్గుణ, ధామజగద్వంది, తామిళ్లలి, ప్రేమఁగని. దేవా.

౨ ఈశసదాశివ, హితగుణసముదయ, కేశవనుత ముని, కీర్తిత
చరితా; ధీశరధీసర్వ, దేవార్చిత, దివ్యపద. దేవా.

౩ అచ్చమాంబికబో్రివ,విచ్చేయరా సామి,సచ్చిదానందమూర్తి,
సత్యవిస్ఫూర్తి, నిచ్చలునీకీర్తి, నిండుభూ,మండలిని. దేవా.

రాగము-　　　　　తాళము-

'ఇదెన్యాయమా, నాసామి' వలె.

నను బ్రోవవే యోగదేవి-వే. నను.
వనజాక్షి ని, న్వినుతింతును. నను.

౧ గజవదను జననీ, విజయముంగోరినీ,
భజననానర్చేద, రజితగిరీశ్వరి. నను.

౨ కమలవదననను, గాచిరక్షింపవె
యమరసన్నుతశ్రీ, భ్రమరాంబా, నను.

౩ నిశ్చలునినుంగని, నెమ్మిం గొల్చెద
నచ్చమాంబికానతు, లందికరుణంగని, బ్రోవవే. నను.

---

రాగము-　　　　　తాళము-

'　　　　　' వలె.

వర, మొలిచ్చి మన్నింపవే, మురహరిప్రియసోదరీ. వర.

౧ శ్రీపార్వతీనిన్ను, సేవించిమొ్రొక్కెదం,
గాపాడవేనన్నుం, గరుణాలవాల వర, ము.

౨ నిత్యానపాయినీ, కాత్యాయనీ నిత్య,
సత్యవ్రతాసర్వ, సాక్షిబిరాన వర, ము.

౩ విశ్వేయవేయోగ, విద్యాస్వరూపిణి,
యచ్చమాంబికప్రేమ, నరసివేవేంగ వర, ము.

---

రాగము.　　　　　తాళము.

'చెంగ్లాడుదమా, చెలియలందఱు' వలె.

నా, మొఱవినవె, నతులొసంగెద స, మ్మతింగొనవే. నా.

కామాక్షినిను, బ్రేమనుగోలచెదc, గామితములనిడి, కావcగదే. నా.
నీ, రజవదనా, నిరుపమానసుం, దరరదనా,
నారీమణినినుc, గోరిభజించెదc, గారుణ్యాకర, కావcగదే. నా.
సా, మజగమనా, సనకసనందన, వినుతగుణా,
భామామణి స, ద్భక్తజనప్రణుత, కౌమారీననుc, గావcగదే. నా.
అం, బుజనయనా, యచ్చమాంబికావన కరుణా,
అంబాసుగుణక, దంబామదికను, ఖంబులోసcగిననుc గావగదే. నా.

---

రాగము. తాళము.

'లెమ్ము వేcగ మె వేcగ మే, లీలాశుకా' వలె.

సజ్జనావననిరతా, సన్మహితా. స.

౧ సన్నుతించినిను, మన్ననcజేసెదc, జెన్నుమల్లేశా కావుమీ శ్రీశం
కరా. స. (మీ. స.

౨ శ్రీజనార్దనుని, చెంగటవెలసిన, రాజవరదా గావుమీ, రక్షింపు

౩ ఆదరించికరుణా, సాంబుధిcదేలిచి, యచ్చమాంబికనేలోవుమీ,
విచ్చేయుమీ. స.

---

రాగము. తాళము.

'గా, రా, రారమ్మంటే' వలె.

స్వా, మీ, సరసిజభవనుత, నామొఱవినికరు, ణనొసcగిప్రోవుము.

౧ దే, వా, దివ్యమునివినుత, భావమునను స, ద్భక్తిభజించెద. స్వా.

౨ సో, మా, సుజనహితచరిత, సోమశేఖరా, సుందరగాత్రా. స్వా.

౩ ఆ, ర్యా, హరిహయసేవిత, యచ్చమాంబి, కావనజగదీశ్వర. స్వా.

రాగము.　　　　　తాళము.

'ఏమిటికింకరావు' వలె.

శంకర కావవేలా, శరణుచర్మచేలా;
యింకనుజాలమేలా, యీశ్వరభక్తలోలా. శం.

౧ మృత్యువిదారివీవు, మ్రొక్కితినేలరావు,
నిత్యసుకీర్తిగావు, నెమ్మినిబ్రోవరావో. శం.

౨ నెచ్చెలి బుద్ధిఁగొంటివా, నీసతిమాట వింటివా,
ముచ్చటఁ జూచుచుంటివా, మోడ్పుఁగరంబులంటినో. శం.

౩ ఇందుధరానీకన్న, నితరముఁగాన నన్నా
నందఱిఁబ్రోవుమన్నా, యచ్చమాంబికావనయో. శం.

---

రాగము-　　　　　తాళము-

'వానినెడఁబాసినే, నెటునోర్తునే చెలి' వలె

నమ్మినానురాభవా, నారాయణీధవా;
యిమ్మహిని నీకన్న, నితరదైవములేడని. న.

౧ సుందరేశ్వరభక్త. సులభుఁడవీవని;
నందితామరుఁడవని, నారాయణార్చిత. న.

౨ దేవాధిదేవానీ, దివ్యనామమహిమము;
భావముననిల్పుమరి, భవబంధమోక్షమని. న.

౩ అగజాధినాధసో, మాదిత్యలోచన
యచ్చమాంబికావనుఁ, డౌ సామినీవని. న.

సమాప్తము.



శ్రీ ర స్తు.

శ్రీ పరబ్రహ్మణే నమః.

# ఏ కాం త సే వ.

## తలుపులుదగ్గఱి పాట.

శ్రీగిరివెంకట, శ్రీపార్వతికడఁ, జింతనుబొందుచునుండెన్, శ్రీ,
శివుని రాకఁగనుచుండెన్.

గంగనుగూడుకొ, ఘనముగ వచ్చెను, గరళకంఠుఁడచ్చటికి,
నా, ఘనునిగనెను శ్రీగౌరి. శ్రీ.

చిరమరలాడుచు, బిరబిరనడచుచు, గిరిజకవాటముమూసె,
వల, విరిపాన్పునఁబవళించె.

అంబకవాటం, బటువేయుటఁగని, హరుఁడది యేమనితలచెన్,
గ, త్యాంతరమున నటునిలచెన్.

శం. తలిరుబోడి నే, వలపున వచ్చితిఁ, దలుపుఁదీయవే భామా,
నా, తలఁపుఁదీర్పవే లేమా.

గౌ. వలపనిపలుకుచు, వాదము లాడుచు, వాకిటఁ దట్టెద వేమి,
నీ, వలపుగొలుపు పేరేమి.

శం. సంకటహరణుడు, శంకరుఁడనుచును, సజ్జనులందు రెనన్ను,
నో, సారసలోచన నమ్ము.

గా శంక లేలయో, శత్రువినాశన, సంకటములు గలవార, లే,
వంకఁజూచినను లేరు.

శం. నీలకంఠుఁడని, నిరతము దలఁతురు, నిగ్రహింపకే గౌరి, నే,
నిలువఁగలనె సుకుమారి.

గా. నీలకంఠులకు, నేఁ డెలేలయిఁక, నిగమాద్రికిఁ బోవోయీ,
నీ, నెలవుల నెఱుఁగుదు మోయీ.

శం. నందివాహనుల, డందురు సతినను, మందగమన ముద మొందు,
మో, యిందువదన నను జెందు.

గా. మంగళకరమా, గంగను గూడుకో, పొంగుచు నుండఁగదో
యీ, యీ యంగన బిలచినదోయీ.

శం. కామదనుఁడని, గణుతింతు రే నా, కాంతుఁదీర్పవే కాంతా,
నను, గారవింపవే నెలఁతా.

గా. కాముసిఁజంపిన, ఘనునకుఁ గాంతల, కాంక్ష లేదపోవోయీ,
మము, గానవలదు చనవోయి.

శం. చొక్కనాథుఁడని, నిక్కము దలఁతురు, మక్కువఁదీర్పవెమ
గువ, ననుఁ, జిక్కులఁబెట్టుట తగవా.

గా. ప్రక్కననుండఁగఁ, జిక్కులేలయా, చేడెపేర దేమోయీ,
నటఁ, జేసెదఁజెప్పఁగదోయీ.

శం. వచ్చిజాముగా, వచ్చెనిలచియుట, మచ్చకంటిదయఁజూడు,
మన, సిచ్చి ముచ్చటలనాడు.

గా. సచ్చరితామన, ఘచ్చమాంబికను, మెచ్చిపోవఁగదవోయి,
కృప, నిచ్చి కేఁగరావోయీ.



రాగము. తాళము.

'ఇద్దఱిలోసఖియెవ్వరుధుడుకే' వలె.

ఓరమణులు మెట్టి, నీరునుదీయరే;
గౌరికిఁగర్పూర, హారతులీయరే. యో.

౧ వేఁడుకలలరఁదీ, వించి టెంకాయ;
మూఁడుమాఱులుఁద్రిప్పి, ముంగిటఁగొట్టరే. యో.

౨ సృష్టికర్తతో వాదు, చేసెనేగౌరి;
దృష్టిదగిలె జగ, తీ జనములచే. యో.

౩ పచ్చలఁ జుట్టుఁద్రిప్పి, ప్రక్కలఁజల్లరే;
యచ్చమాంబికావం, ద్యయనిగొల్వరే. యో.

---

రాగము- తాళము-

'నలుఁగుకురారా, నందకుమారా' వలె.

పువ్వులఁజల్లరే, భువనవంద్యునిపై;
జవ్వనులారా, సరగునరారా. పు.

౧ పొన్నవిరులును, బొడ్డుమల్లెలును;
సన్నజాజులును, సంపెంగలును. పు.

౨ మల్లెమొగ్గలు చే,మంతి రేకులును;
మొల్లకుసుమము, లునుగోరంటల్. పు.

౩ పచ్చసంపెఁగలు, పద్మదళములు;
నచ్చమాంబికానుత, యని పలుగతులఁ. పు.

రాగము.  తాళము.

'రాఁగదవయ్యాపూల,రంగనితోడలీల'వలె.

నలుఁగునకు రా రాని, న్బలుమరు వేడెదఁ;
బాలఁతి గౌరితోఁగూడి, పుణ్యపురుషా వేఁగ. న.
౧ పచ్చపుటువ్వాజి, పసుపు కచ్చూరములతోఁ;
హెచ్చువేడుకమీఱ, నెలనాగలు నలంచెదరు. న.
౨ తెగడంతజాలము, తరుణేందుశేఖర;
యగరుగంధముమీన, నేఁచెదవేవేఁగ. న.
3 చిత్రజాకారనీకుఁ, జేడియలందఱు;
నత్తరలంచెద, రచ్చమాంబికాపన న.

రాగము-  తాళము-

'అరవిందనయనరంగనిహాయిలు'వలె.

శుభమందుసతీపతులను, దీవించిపాడిరి,
చంచలాక్షులు పసుపక్షత, లుంచిశిరసున. శు.
౧ శంకరునకు, శ్యామలాంబకు, ముద్దుమోముల,
కుంకుమనిడి, కోమలాంగులు. శు.
౨ బంగరుగిన్నియను బోసినసం,పెంగనూనె,
మంగళకరమనుచునంటిరి. శు.
3 అతివెలుజలకమ్ములార్చిరి, యచ్చమాంబికా,
హ్లాదకరాయనుచు వేడిరి- శు.

రాగము-　　　　　తాళము-

'గానబన్సివాలోకేగా' వలె.

పసుపునలిచెనే శ్రీగౌరి, భానుకోటితేజునకు, భా॥ భా॥ పసు॥

౧ కుంకుమగరుకస్తూరి, పొంకమైనగంధము, పొం॥ పొం॥ పసు॥

౨ వనజవదన శిశునికరంబు, వినయమొప్పఁజేపట్టి, వి॥ వి॥ పసు॥

౩ అచ్చమైనప్రేమతోడ, నచ్చమాంబికానుతునకు, న॥ న॥ పసు॥

---

రాగము-　　　　　తాళము-

'గోవిందనీవిందురావెందునకురామా' వలె.

శ్రీగంధమలఁదవే, చిగురుఁబోఁడిరో నీవు;
యోగీంద్రనుతుఁడైన, భోగిభూషణునకు. శ్రీ.

౧ కంబుకంధరినీదు, కాంతునియొడలిపై;
కస్తూరి పునుఁగుఁ జ, కలిఁగ జతగూర్చిన. శ్రీ.

౨ కమలాక్షులునిన్నుఁ, గని సంతసమునంద;
ఘుమఘుమవాసించు, సుమరసములతోడ. శ్రీ.

౩ అచ్చమైనమల్లె, యత్తరుల్ఁజేర్చి;
యచ్చమాంబికఁబ్రోచు, నట్టిశంకరుమేన. శ్రీ.

---

రాగము.　　　　　తాళము.

'పాలించరాపాండురంగా' వలె.

గంధమలందవదేమే!
కంబుకంధరినీదు, కాంతునిమేన, నీకాంతుని॥ గం.

౧ వనరుహలోచన, పునుఁగు జవ్వాజితో;

ఘనమైన పన్నీరు, గలిపినమంచి, గలిపిన॥ గంధ.

౨ మంచిగంధముఁదీసి, మల్లెయత్తరు వేసి;
చంచలాక్షిరోనీదు, సఖులందిచ్చెడి శ్రీ॥ నీసఖులం॥ గంధ.

౩ భవబంధములఁబాపి, భక్తులఁబాలింప;
నవతరించినయచ్చ,మాంబావంద్యునకు,అచ్చమాంబా॥గంధ.

---

రాగము. తాళము.

'కరతలేశ్రీరామచంద్రనా'వలె.

గౌరీపన్నీరుచల్లఁగదే॥ వర॥ గౌ॥
ఏరా, ధీరా, రారా, యని, వర॥ గౌ.

౧ రాజితమగునప, రంజిగిండియతో, సుదు;
రాజా, శ్రిత చరణా రక్షింపుమని, వర॥ గౌ.

౨ కోరివివిధసుమ, సారములనుజేర్చి, సుకు;
మారా బ్రోవుమని, చేరిసేవించి, వర॥ గౌరీ.

౩ అచ్చమాంబిక ప్రణుతాంఘ్రియుఁగా, దేవా, కృప;
నిచ్చికావుమని యిందీవరాక్షీ, గౌరి. వర.గౌ.

---

రాగము- తాళము-

'బాలామణిరోవినుమా'వలె.

భామలలామావినుమా,పన్నీరుచల్లి,పాటలుపాడుదమా.భా.
౧ భక్తవరదులని, భావమునందిడి, భక్తితో వేడుదమా. ప॥ పా॥
౨ మంగళకరమగు,మగువకుశివునకు,బంగరుపాత్రలతోఁ,బ॥ పా॥

3 అచ్చమాంబికనుత, యమరార్చిత యని, పచ్చల గిండియతోఁ,
బన్నీరుచల్లి, పాటలు.

రాగము. తాళము.

'యబోలునామహారాజహామిసే'వలె.

పన్నీరుపైఁజల్లెనే, బల్వేడుకన్, బన్నీరు.
పరమాహ్లాద,కర హృదయుండై. ప.

౧ వరలక్ష్మియు సర, స్వతి శచిమొదలగు;
సురసతులెల్ల, శుభముశ్శుభమనన్,
సరసీరుహాలో, చనుఁడతి ముదమునఁ. బ.

౨ హరుఁడునగవుతో, గిరిజయొడలిపైఁ;
బరపెడిచూపుల, సరసతతో,
భామామణిపైఁ, బంతములఁజెలఁగి. ప.

3 మెచ్చిజగములకు, మేలునొసఁగవే;
యచ్చమాంబికా,హ్లాదకరాయని.
సచ్చారిత్రుని, సాధుజనులనన్. బ.

రాగము. తాళము.

'జత్తైత్తిజేల్పొరుమబాగామెఁగా'వలె.

చిత్తమురంజిల్ల శ్రీగౌరికి;
నత్తరునలంచెనే స, ర్వాధారుఁడు. చి.

౧ ప్రేమాస్పదంబైన, మోమొప్పఁగా;
లేమముద్దు, మోముఁజూచి, లేనవ్వుతోఁ. జి.

౨ సుమగంధమందంద, సొంపొందఁగాఁ
సోమధారి కాంతిజగతి, శోభిల్లఁగాఁ జీ.
౩ అమరాళిగడుభక్తి, నర్చింపఁగాఁ
నచ్చమాంబికవినతుల, నర్పింపఁగాఁ. జీ.

---

రాగము. తాళము.

'సిగ్గేలరా వేభామిని'వలె.

ముత్తాళినీలవేణిరో; యుత్తరలందెనే, హరునకుఁజాన్వతి. ము.
౧ చిత్తజాకారుని, శ్రితజనోద్ధారుని;
బత్తివినయముల,భావమునందిడి. ము.
౨ మంచిసుగంధము, నించినగ్లాసలను;
ముంచితేలిచినట్టు, లెంచెదనామది. ము.
౩ అచ్చమాంబికానుత, యమరసేవితయని;
యప్సరాంగనలెల్ల, నారతులొసఁగఁగా. ము.

---

రాగము. తాళము.

'పూలబంతులాడిరి గోపాలుఁడు రుక్మిణికెదుటఁగను'వలె.

సంతసంబుమీఱఁబూల,బంతులనాడెనువింతగను,
వింతగను, విం., కంతుహరుఁడు ప్రియ, కాంతామణితో. సం.
౧ పొంగుచుసురమునిపుంగవుల, మంగళకరుని ప్రసంగములు;
రంగుగనింగిఁజెలంగఁగను,తుంగకటయా, పాంగభయ;
భంగయనుచు వా,రాంగనలాడఁగ. సం.
౨ సామజవరదుఁడు వేడఁగను, భూమిసురులుఁగొనియాడఁగను;

చేరితో సురమునిపాడఁగను, సోమపరాత్పరఁగనుచుఁ
శ్రీవణి మొదలగు,భామలుచూడఁగ. సం.

3 జాజులును మొల్లలును, సంపెఁగలు మరపొన్నలును;
రాజితంబగు కేతకివిర, జాజిమొగ్గలు వీడఁగను;
రాజహితఁడు ఘన నీ,రేజముఁలాదిగను;
భూజనముల్,రాజిలఁగ,నాజనార్ధనుఁడు,హర్ష మునొందఁగ,
నచ్చమాంబికాహృ, దంతరవాసుఁడు. సం.

---

రాగము- తాళము-

వనజముఖి, వానిఁజూసి, యొంటినుంటినే వలె.
ఇంతిరో చే, మంతి విరి, బంతులాడెనే;
సంతసమొదవంగనుమా, కాంతతోడను, విరి,బంతులాడెనుఁ
హితు,లెంతో వేఁడనో. యుం.

1 వారవధూమణుల నాట్య, వైఖరి మెఱయ;
నారద గానంబు మింటభోరున మొఱయ;
ముర,వైరియునరయఁగను,సారసాక్షితోడ నో. యుం.

2 మోముఁలఁజిఱునగవుల నెడి, మొలకలెగయఁగా;
సోముఁడు వెన్నెలలు పయినొసఁకఁగాయఁగా;
లో,కైకనాయకుం,డగు, స్వామి శర్వాణితోఁగూడి. యుం.

3 వెలఁదుకలందఱునుగూడి,వేడుకఁజూడ;
నలజాజులతోడ నచ్చ, మాంబికావనుఁడు;
గగ, నాంబరుఁడవుడు, ఘనుఁ,డంబుజనాభార్చితుండో.యుం.

రాగము-　　　　　తాళము-

'శ్రీమహాగణపతినీకు, సేవఁజేసెదరా' వలె.

ఓమహా,మహిమాన్విత, ప్రేమనుగనుమీ,యో.యో. యోమ.

౧ పంచదారయేలకులతోఁ, బాలుఁగ్రోలుమీ, యీ-యీ-యీ.

౨ సగముద్రాక్షిగిన్నియతో,సకియతోసఁగుమీ,యో.యో.యోమ.

౩ అచ్చమాంబికానతేనుతు,లవధరింపుమీ,యవధ,య,య, ఓమ.

రాగము.　　　　　తాళము.

'నలుగునకు రా రే సమే' వలె.

వీడెము సేయ వేయో, వెలఁదిస ర్వేశుసతో;

నాడెమా తెల్లనాకుల, తోడఁగూడినయట్టి. వీ.

౧ ఇంతసిగ్గేలనెయో, యిందునిభాననసీ;

కాంతునిప్రేమనీజగ,మంతయుఁ బాలించుతల్లి. వీ.

౨ రాపేలజాజికాయ, జాపత్రియేలకులు,

యాపైనలవంగము మే, త్రైనట్టి కుంకుమ పూ. వీ.

౩ పచ్చకర్పూరముతోఁ, బలుచనివకలతో;

నచ్చమాఁబికావరదుఁడం, దిచ్చుచున్నాఁడు నీకు. వీ.

---

రాగము.　　　　　తాళము.

'నలుఁగునకు లేచిరారా' వలె.

వీడెము సేయవేరా, విమలవిచారా;

వేడుకలక్ష్మిఅనీదు, వెలఁదికందిరా. వీ.

౧ జాజికాయజాపత్రి, సదమలగా త్రా;

రాజరాజేశ్వర, రమణికందిరా. వీ.

౨ కుంకుమపువ్వునేల, కులు లవంగములుఁ;
బంకజలోచన, పడఁతికందిరా. వీ.

౩ పచ్చకర్పూరములోఁ, బండుటాకులతో;
నచ్చమాంబికావన, నతివకందిరా. వీ.

---

రాగము- తాళము-

ఆకుమడపులందరా వలె.

వీడెంబులనొసఁగనే, వెలఁదికిఁబరమేశ్వరుండు॥ వీ॥

౧ జాజికాయమేలకుల్, జాపత్రియు లేఁతాకుల॥ వీ॥

౨ సరసోక్తులనాడుచుం, బరమాహ్లాదమునఁనుంచి॥ వీ॥

౩ అతివెలువినుతింపఁగా, నచ్చమాంబికావినోది॥ వీ॥

---

రాగము. తాళము.

నలుఁగిడను బిలచేరే వలె.

వీడెములందెనుభవ్రుఁడు, వినుతాఖిలమునిజనయుతుఁడు;
చేడెలువేడుకఁగూడిగనుంగొన॥ వీ॥

౧ తరుణులుకొందఱుగౌరి, కరమునుబట్టుచు మురియుచును;
గరుణాకరుఁడౌ, హరునకిప్పించిరి॥ వీ॥

౨ జాజులుమల్లెలుసన్న, జాజులుకొప్పునరాజిలఁగ;
రాజవదనసుర, పూజితునకొసఁగ॥ వీ॥

౩ అతివెలుమంగళమనుచు, నచ్చమాంబికావనుఁడనుచు;
హితమతిలోనా, రతులిడివేడఁగ॥ వీ॥

రాగము-　　　　తాళము-

'ముద్దుకృష్ణునకు' వలె.

శ్రీగిరీశునకు, శృంగారవేషునకు, భోగిభూషణునకు మంగళమ్.
యోగీంద్రనుతరాజ, యోగస్వరూపిణి, యాగజగమునకు మం. శ్రీ

౧ దాసపోషణునకు, దనుజశోషణునకు, వాసవార్చితునకు మంగ.
భాసురమగుపర, బ్రహ్మంబుతానైన, భామాలలామకు మం శ్రీ

౨ మంగళకరునకు, నంగజహరునకు, గంగాధరునకు మంగళమ్.
పొంగుచునిజపతి, చెంగట నెలకొన్న బంగారుబొమ్మకు మం. శ్రీ

౩ సాధుసేవితునకు, సన్మౌనినుతునకు, శ్రీధరార్చితునకు మంగళమ్.
ఆధారభూతమై, యఖిలంబునందున్న, యాదిశక్తికిశుభమం. శ్రీ

౪ భూజనావనునకు, బుధహితాచ్ఛమాంబ, పూజితునకు శుభ.
రాజేశ్వర్యంత, రంగనివాసియా, మాజగదంబకు మంగళం. శ్రీ

రాగము.　　　　తాళము.

'ఏ, గౌరి చెలిరేభరణీ, మోహనాంగి' వలె.

మంగళమని పాడరె స్వారంగనయనలు.

౧ తుంగీపతిశేఖరునకుఁ, బొంగుచుమీరల్, బల్,
రంగుగమీరల్శృం, గారవతీయగునుమ, కుంగరమరు దారన్. మం

౨ నిరవధికరుణాకరునకు, నిగమనుతునకున్, స, త్త్వగుణయుతున
కున్; వరమృదుతరభాషిణికిన్, వారిజనయనకున్. మం.

౩ అచ్ఛమాంబావనునకు, వార్యనుతునకున్, స, కాకార్యరతు
నకున్; మెచ్చిదాసులఁబ్రోచు, మీనలోచనకున్. మం.

రాగము. తాళము.

'బాలకృష్ణుండదుగో వచ్చెన్' వలె.

శరణుశరణు శంకర మ, మ్మరసిగావుమీ;
గిరివరజాలోల మమ్ము, గరుణంజూడుమీ॥ శ॥
౧ నీదుసేవసల్పెదు మ, మ్మాదరింపుమీ;
వేదవేద్యనమ్మితి స, మ్మోదమొసంగుమీ॥ శ॥
౨ కరుణానిధివనుచునిన్నుఁ, గాంచితినిజమీ;
గిరిధరమత వేడెద స, త్కీర్తి నొసంగుమీ॥ శ॥
౩ అచ్చయాంబికావినతుల, నాదరింపుమీ;
మెచ్చివరం,బిచ్చికావ, నిచ్చఁదలఁపుమీ॥ శ॥

---

రాగము. తాళము.

'లాలి భక్త పరిపాల' వలె.

లాలి నీలవేణి, లాలిపల్లవపాణి, లాలిశుకవాణి, లాలి పువ్వు
బోణి శర్వాణీ; శైలబాలమంచి, పూలపాన్పుపైన; బాలేం
దుధరుతోడఁబవళింపుమమ్మా॥ లాలి॥
౧ నారదాదులింపారు వేడ్క, ను, నాదముగ వీణెమీటను;
శౌరిపత్న్యవి, శారదలు వారు, నారులాడెదునాటను;
సారసాక్షి యిం,పార నొక్కమా,అపారకరుణఁ
గాంచిపవళింపుమమ్మా॥ లాలి॥
౨ కామహీనిసర్వ, కామఫలదుఁడౌ, స్వామికృపఁగోరివేడుచుఁ;
ప్రేమమీఱ షు, శ్యామవరదుని, నీమమునఁ గొనియాడుచు;
రామలెల్లనీ, రాజనంబులియ్య, భామాలలామరో,
పవళింపుమమ్మా॥ లాలి॥
౩ సాంబుకృప సర్వసాక్షివై యుజ్జ, గంబులేలఁదలంపుమీ;

కంబుకంఠీమ, దంబుతోనచ్చమాంబికను బ్రోవనెంచుమీ;
యంబుజాస్యశ్రీమ, లానిలంబువీవ, ననుపమసుఖనిద్ర,
నంది మేల్కానుమీ॥ లాలి॥

రాగము- తాళము-

'కాపాడిరక్షింపరా' వలె.

లాలియని పాడరే, రారె॥ లాలీ॥
బాలేందుమౌళికి, లోలాత్ములు లాలి. లాలి॥

౧ సత్యస్వరూపుని, నిత్యపవిత్రాపుని, బిత్యహాముంచేసి మ,
రాజిల్లఁగా లాలి- లాలి॥

౨ జాజులుకొప్పున, రాజిల్లఁగాఁబూర్ణ,
రాజనిభాస్య వి,రాజితగాత్రుని. లాలి॥

౩ నిచ్చలుఁజేసిమతో, నీరేజలోచన
లచ్చమాంబికా ము,దావహుని. లాలి.

రాగము- తాళము-

'అదోవచ్చెశౌరి' వలె.

కరుణాన్నేల్కొనుమీ; గౌరీయుత. క॥

౧ సరోజహితుఁడవ,తరించెను గౌరి,వ్వరుల్ధరంజెలఁగనళికుల
మురంజిల, నిరంజన, పరాత్పర. క॥

౨ అశేషకలుషౌఘశోషణా, దశదిశల్బ్రకాశస్థకాంతినిగని;
నిశాంతసమ,యశోభఁగౌనె, విశేష. క॥

౩ శుకంబులును గం,డు కోయిల ల్కా, రికానికాయము,
లుకూయఁగ, నకాద్రికా,ర్మకాశర,ణకావుము. క॥

సమాప్తము.





శ్రీ ర స్తు.

# బువ్వపుబంతి పాటలు.



రాగము. తాళము.

'రంగా నినుహాసి కేబారో' వలె.

బువ్వము నారగింపరారా, హరి, బువ్వంబు నారగింపరారా.
రవ్వాలతోడ, రాజిల్లుపీటపై, బువ్వంబు.
౧ లడ్డుజిలేబి, వడ్డనజేసిరి, యిడ్డెన్సోమాసితోడనేడు. బు.
౨ పూరీలు పెూళిగల్, శ్రీరాన్నముల్పులి,
పెూరఫేణితోడనేడు. బు. (మ. బు.)
౩ హర్ష ముమీఱ, నచ్ఛమాంబికావనా, యతిరసములతోడ నే



రాగము. తాళము.

'గంగాధర, గౌరీధవ' వలె.

రారాసుత, మారా బువ్వ, మారగింపరా, వే,రారా.
ఏరాయిదిమేటా, తగ,వేరా చలమేరా;
ధీరావర. మీరాబువ్వ, మారగింపరా॥ రా॥
౧ కూరలుభక్ష్యముల్, క్రొత్త పచ్చడులు,నల,చారపప్పు నెయ్యి,
బల్,గారెల్పరమా, ధారల్సువి,బా,రాగోనుమీ; యిటు,రా.
౨ దండిలడ్డు ఫేణీల్, వండివడ్డించిరి, మేలరండచక్కెరతో, బ్రి
ష్టాండాధిపా,ఖండకృపా, ఖండలవేగ, నిటు, రారా.

3 మెచ్చికనఁదగిన,మెల్మి వస్తుతతిఁ.గను, మచ్చమాంబికసుత, యి
ట్టు,విచ్చేసినీ,యిచ్చన్మద,మెచ్చన్గనుమీ; యిఁక, రా రా॥

రాగము. తాళము.

'రాణివాసము వెడలె'వతె.

బువ్వభుబంతికిఁబిలువుము, పువ్వుబోణిరో;
నవ్వులాటగాదు లోక, నాధునివేఁగ. బు.

౧ పెండిలిపీటలునుబఱచి,యుండెడిఁగనుమీ;
నిండిరిజనులెల్ల వచ్చి, నీవిఁకఁజనుమీ. బు.

౨ వడ్డనఁగావించిరి యా, వంకఁజూడమీ;
దొడ్డపదార్థములతోడఁ, దోయజముఖులు. బు.

3 వచ్చికూరుచుండిరిమన, వారలెల్లరు;
అచ్చమాంబికాప్రణుతా, యనుచుమెల్లన. బు.

రాగము. తాళము.

'గగ్గముగ'

వేడుకనొనరించెనే, వేదవేద్యుని బువ్వముకదు. వే.
విధీంద్రులన్ సుధాంశు, మధుసూదనులచే సన్నహితమై. వే.

౧ సిరివాక్సతిసురసతుల్, గిరిజసరసఁగూరుచుండిరి;
సురాసురుల్. నరేంద్రుల్, పరమేశ్వరులఁబఁ, ఁఁ, బ్రబలిరి. వే.

౨ అవనీధరుఁడల్లునిన్, సవినయముగ సిలిచికొలువ;
దివిన్భువిన్భవానీ, భవులప్రస్తుతిచేత, బహుళమై. వే.

3 సకలపదార్థములచే,నొకకొఱఁతయుఁజెందక, మే;
నకా,దికం,బుకంఠీ, నికరంబు నచ్చమాంబికమెచ్చన్, వే.

రాగము-　　　　　తాళము-

'సరసిజోద్భవశీల'వలె.

విందగనొడ్డించిరి, సంతసమునమించిరి;
కాంతరోశంకరులబువ్వ. మెంతయువినుతించిరి. విం.

౧ అరిటాకులనేతిచే, నభికరణముజేసిరి;
వరుగులు నప్పడములుల్, వడియములును బజ్జులున్॥ వి॥

౨ వరమృదులాన్నంబును, వనితలుసూపంబును;
బరమాన్నము ఘృతమువివిధ, భక్ష్యములునుఫలములున్॥విం॥

౩ పచ్చడులును గూరలున్, భాక్ష్యములునుమాఁడులు;
నచ్చమాంబికావనునకు, నతివెలుపలుమాఁడులున్॥ విం॥

రాగము.　　　　　తాళము.

'పూటబందివే'వలె.

విందుజేసిరి, వియ్యాలవారింట॥ విం॥

౧ మండిగల్ఫేణీలు, మాఁటునకులేవు;
వండికందుపప్పు, మెండుగావడ్డించి॥ విం॥

౨ ఊరుఁగాయలేదు, చారుపెట్టలేదు;
కూరలైనలేవు, నీరుమజ్జిగతో॥ విం॥

౩ అప్పడమ్ములలో, నుప్పుచాలకుండఁ;
జప్పనై జిలేబి, చక్కెర లేకుండ॥ విం॥

రాగము-　　　　　తాళము-

'పోరా నెఱజాణ'వలె.

ఏమే యోవదినా, నీ, వీభోజన, మెటునేర్చితి. వేమే,

౧ తియ్యకందనేతిలోన, దివ్యముగావైచిమేము;

వియ్యాలురాలనివైచినఁ, గొయ్యఁగూరఁదెమ్మనియెద. వేషే.

౨ పంచదారపాలతోఁగాంచిన పరమాన్నమిడినఁ;
గొంచెముదిని కారము తే, దంచుసావలఁద్రోసెద. వేషే.

౩ తోడుకొనిన పాలుమీఁగడ, తోవడ్డనఁజేయుచుండ;
నాడెముగాదిది మాకని, నా మోమునుజూచెద. వేషే.

సమాప్తము.

---

రాగము- తాళము-

'విధితనయే' వరె.

రారానలుఁగునదు, రఘువంశరక్షక;
రాక్షసశిక్షక, రయముననీవిటు. రారా.

౧ పన్నీరత్తరును, బాగైనగంధము;
సన్నుతాంగజల, జవదనలిడెదరు. రారా.

౨ ముద్దులబొజ్జపై, ముత్యాలహారముల్;
ముదమునఁగదలఁగ, మునిజనసేవిత. రారా.

౩ అతివలందఱు నా, హ్లాదమునంజూడఁగ
నచ్చమాంబికావన జగదీశ్వర. రారా.

---

రాగము. తాళము.

'నిన్నేనమ్మినాను; నీరజనయన' వరె.

కావవేమృడానీ, దేవదేవురాణి;
భావమందు నిన్నే, సేవించుచున్నానే. కా.

౧ భామినీమణీ ని, న్నే మదినెంతునే;
ప్రేమమీఱఁబ్రోవ, వే మరాళయాన. కా.
౨ వనజలోచనా ని, న్ననిశము వేడెద;
కనికరంబుమీఱఁ, గానన్నేలరావే. కా.
౩ పచ్చనారతులు, భామినీలొసంగ;
నచ్చమాంబికను, మెచ్చిబ్రోవరావే. కా.

## మంగళ హారతి.

రాగము. తాళము.

మంగళంబనియాడిపాడరేవలె.

అంబకుహారతులెత్తరే, చక్కనిశ్యామ,లాంబకుహారతులెత్తరే.
అంగనలందఱుఁగూడి, పొంగుచుగంగాధరునియ, ర్ధాంగికినా
నందమలర, బంగరుపళ్లెరములతో. నం.
౧ వాసిగశ్రీశైలము ని,వాసముగనెలకొన్నట్టి, వాసవార్చిత, ప
దకమలకుముని, వంద్యసుచరితకు; దాసులనుబ్రోచునను, నా
సతోనున్నట్టిజనుల, దోసముతెడఁబాపు మహి, షాసురమర్ద
నికిప్పు, డం.
౨ పొందుగగుజరాతిపేట, యందువెలసిన త్రిపుర, సుందరీయని
వేదుదు మద, మంది సుందరులు; అందమౌశర, దిందువదన
కుఁ, గుందరదనకు, మందగమనకు, నందితామరబృందకును
మీ, డెందములనా, నందమొందుచు. నం.
౩ తీరాకారుమారీపురిని, జేరిన సజ్జనులఁబ్రోచు, వారిజా
క్షికి నచ్చమాంబా, వంద్య సుచరితకు; నారీమణులు,సారెసా

రెపుc, గోరిసన్నిధిc, జేరికొల్చుచు, భూరిదురితవి, దారి రిత్రు
సం, హరియనిమది, గోరివేడుచు. నం.

## పంచ భూతముల కీర్తన.

'రామనీసమానమెవరు'వలె.

ఖరహరప్రియ—ఏకతాళము.

భామినీలలామ వినుమి॥ భా॥

ఈమేలోనరించినందున, కొంతమఱవకుండవలయు॥ భా॥

౧ భూమిcగలిగెc గందమూల, భూజఫలతృణాళిధాన్య;
హేమరజితలోహసమితి, యింతీరో రాకాసిబాగ్గు॥ భా॥

౨ పవనమల్పకీటములను, పక్షులకందిచ్చుచఖిల;
భువనవస్తువులను బెంచు, భూరిమేఘములనుగూడి॥ భా॥

౩ అగ్గిచూడుమా నగమున, నద్దిలేమిc జేయుపెద్ది;
మొగ్గశీతకాలమందు, మొనసివండి తినcగcగలమె॥ భా॥

౪ ఇదిగో వచ్చునుదకముగను, మిందునందు నీcదుమీలు;
అదియొకింతమరిగెనేని, యపుడెయస్తమించుజగము॥ భా॥

౫ ఆకసమనిపూర్వులనెదు, నైదవభూతంబు హిందు;
లోకులంట రాదుకడలు, లోcగc బుట్టియుండునందు॥ భా॥

౬ ఆకసంబునిట్టిదట్టి, దని నిరూపణంబుచేసి;
నీకునాకుc దెలియవశమె, నిజము బుధులకొకరికొఱుక॥ భా॥

---

## గృహకృత్యములు.

హిందుస్తానీ కాపి— మిశ్రతాళము.

'ఏలరనాపై చాలుర మోహము'వలె.

నేర్పవే దేవ నే, నేపనిజేసిన॥ నేర్ప॥

నీకర్పణముజేసి, నిరతము గనుగొన॥ నేర్ప॥

౧ నీకొలుకనునది, సోకినఁజాలును— (నీకొలుకనునది)

నీచపుపనిఘన, మైచని పేర్మిగను॥ నేర్పవే॥

౨ పటుతరభరమై, నటుపనిమైనను— (పటుతరభరమై)

తృటినొనరింతురే, భటులునునీకనిన॥ నేర్పవే॥

౩ గదితుదుచుచు నీ, ముదమిడుశాసనము—(గదితుదుచుచు నీ)

మదినిడిచేయ న, గ్యాదిగదురమ్యముగ॥ నేర్పవే॥

౪ ఇదెసుమియాజగ,ద్విదితమా 'పరుసవే—(దిదెసుమియాజగ)

ది' దగిలినఁగనక, ముదయుమపునుగద॥ నేర్పవే॥

౫ స్వామితనదిగను, ప్రేమతోఁగైకొనఁ—(స్వామితనదిగను)

గా మహిలోఁ దక్కువ, గా నదియేలయగు॥ నేర్పవే॥

---

## సత్యము.

పరికాంభోజిరాగము—చాపుతాళము.

'రమణీమణి సామినితే వే'వలె.

వనితావినుమీవు నిజంబు॥ ఓవనితా॥

ఘనమహితంబు, గలసత్యంబు॥ నో, వనితా॥

౧ కలిమినిజముగా,గలుగవలెనుగా,

కలిగినయట్టులఁ, గనుపడగాదు॥ ఓవనితా॥

౨ ఒనరుతుగొప్ప, పనినిఁకననక,

జినమొకించుక మే, లొనరుపచాలు॥ నో,వనితా॥

౩ అవివేకుల మా,టావలనుంచుము,

అవిరళదయస, త్యములకుసాటిమె॥ యోవనితా॥

సమాప్తము.

